## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year
1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject
Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language
Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం

శ్రీ గురుభ్యోనమః

# జ్ఞానబోధశతకము



ఇది

తూర్పుగోదావరిజిల్లా అమలాపురంతాలూకా

గెద్దనపల్లిగ్రామ నివాసియగు

మట్టపర్తి నడవపల్లిచే

రచింపబడి

సత్పురుషుల ధనసహాయమున

అమలాపురం

శ్రీమారుతి ముద్రానిలయమున

ముద్రింపబడి

గ్రంథకర్తచే ప్రకటింపబడియె.

ఓం.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీమహాగణాధిపతయేనమః

శ్రీమద్గురుచరణారవిందాభ్యాంనమః

# జ్ఞానబోధశతకము.



ఆ॥ శ్రీమదాత్మగురుని సేవింతు నెప్పుడు
భ్రాంతిరహితమైన బాటజూపి
నిత్యసుఖముగాంచు నేర్పు నేర్పినవాని
వినుముజ్ఞానబోధ గనుముమనస ॥ 1

ఆ॥ వ్యాసకాళిదాస వరకవీశ్వరులకు
వందనములు జేసి వ్రాయుచుంటి
జ్ఞానబోధయనెడు శతకంబు దీనిని
వినుముజ్ఞానబోధ గనుముమనస ॥ 2

* నీ తి బో ధ *

ఆ॥ తన్ను పొగడుకొనుట తనకు మేలును లేదు
పరులనింద జేయ ఫలము లేదు
నింద జేయువాడు నిందితుండగు గాదె
వినుముజ్ఞానబోధ గనుముమనస ॥ 3

ఆ॥ సారమెరుగలేని చాలమాటలు నేర్చి
నిజమెరుగనివాడు నిజము తెలసి
నటునటించి మాటలాడుట నైజంబు ॥వి|గ॥ 4

ఆ॥ తరుచుచదువునతడు తర్కవాదముసేయు
నిజముతెలియజాలు నేర్పులేక
చదువునిజముతెలయ జచ్చునువాదముల్ ॥వి|గ॥ 5

ఆ॥ సజ్జనుండు దుష్ట సహవాసమొనరింప
ముప్పుతిప్పలకును మూలమగును
సాధుజనులగూడ సమకూరుమోక్షంబు ॥వి|గ॥ 6

ఆ। మాయసాధువెన్నొ మహిమలజూపించు
భోగసుఖముకొరకు పొట్టకొరకు
అజ్ఞుడట్టివాని నధికునిగానెంచు ॥వి|గ॥ 7

అ। నువ్వుగింజలోని నూనెగన్పడనట్లు
గొప్పవారిగుట్టు కొద్దిజనుల
కెరుగరాదు మిగుల తరచిజూచినగాని ॥వి|గ॥ 8

ఆ। ఎంతయోగడించి ఏమిపట్టుకుపోవు
మంచిచెడ్డయనెడు మాటెగాని
మంచినడతనడచి మరిచచ్చినామేలు ॥వి|గ॥ 9

ఆ॥ తన్నునోరులుపొగడ తానుబ్బగారాదు
నిందజేసిరేని కుందరాదు
నిందస్తుతియు సమము నిజమైనయోగికి ॥వి|గ॥ 10

ఆ॥ పాపకర్మచేయ పట్టిబాధించును
గడచిపోవువరకు విడువదెందు
గానఘోరకర్మ మానుమీయికనైన ॥వి|గ॥ 11

ఆ। కఠినబాధలెన్నొ కాలుడుపెట్టును
చెప్పతరముగాదు ముప్పువచ్చు
దేహముండగానె దేవునిజూడుము ॥వి|గ॥ 12

ఆ॥ తిరుగరానిదూర దేశాలుతిరిగియు
ధనముసంగ్రహించి ధరణిలోన
కష్టమొందిపెంప కాటికేదేహము ॥వి॥గ॥ 13

ఆ॥ ధనమదాంధులకును దాసోహమనిజెప్పి
ధనముగోరుచుంట తప్పుచాల
హీనవృత్తియిదియె యిమ్మహిలోపల ॥వి॥గ॥ 14

ఆ॥ వాక్కుగట్టివేసి వైరాగ్యమునుబొంది
సర్వసంగములను సాగదోలి
మూలమెరుగునతడు ముక్తికవ్వలనుండు ॥వి॥గ॥ 15

ఆ॥ సర్వభూతములను సమముగాజూచిన
నాత్మరూపుడగుచు నలరుచుండు
నట్టివానిబొగడ నజునకువశమౌనె ॥వి॥గ॥ 16

ఆ తనువుస్థిరమని తలపోయగాలేక
మాయాభవములోన మగ్నులగుచు
వెతలుబడగనేల వేడుకమీరంగ ॥వి॥గ॥ 17

ఆ॥ కాలమెల్లనువృథా గడపుచునుండిన
పరముగానలేక పరితపించు
నిచటసేయకున్న నచటేమిసేతుము ॥వి॥గ॥ 18

ఆ॥ హింససేయువాడు హీనుడై ధరయందు
వెతలబడుచునుండు గతులులేక
హింససేయకుండు హంసను దెలసిన ॥వి॥గ॥ 19

ఆ॥ కోటిజన్మలెత్తి చేటునొందగనేల
మేలుకొనుమునీవు కీలుదెలసి
చాలుచాలుమాను సంసారవాంఛలు ॥వి॥గ॥ 20

ఆ॥ మలముకండలు నెముకలుగలిగినయట్టి
మట్టిదేహమందు మమతగలిగి
యున్నవారుముక్తి తెన్నుగానగలేరు ॥వి॥గ॥ 21

ఆ॥ ఇల్లు వాకిలియును కల్లసంసారంబు
నాదియనుచుచాల నమ్మితుదకు
దండధరునియింట దైవమాయనియేద్చు ॥వి॥గ॥ 22

ఆ॥ భూతపంచకమున మునుప్రపంచమునందు
పుట్టికర్మజేసి కొట్టుకొనుచు
కాలమృత్యువునను గూలునుకడపట ॥వి॥గ॥ 23

ఆ॥ ఆశచేతిమనుజ డధముడై చెడిపోవు
ఆశవిడచెనేని యతిడెలోన
నాత్మతత్వమరసి యానందమును జెందు ॥వి॥గ॥ 24

ఆ॥ ఎంతకాలమున్న నంతమందకపోదు
చింతచేతెనరుడు చివుకుచుండు
సంతసంబుగురుని చెంతజేరక రాదు ॥వి॥గ॥ 25

ఆ॥ మాయచేత జిక్కిపోయి కర్మలజేసి
చలనమొందుచుండు చపలగుణుడు
చపలగుణము విడువజాలక చెడిపోవు ॥వి॥గ॥ 26

ఆ॥ మనగుణములబట్టి మంచిచెడ్డలకును
మహినిజనులుతాము మసలుచుంద్రు
గానమనుజుడెపుడు దీనినెరుగవలె ॥వి॥గ॥ 27

ఆ॥ ఎక్కడితలిదండ్రు లెక్కడిసతిసుతు
లెక్కడిధనధాన్య మేమిజన్మ
తనువువిడచునపుడు తనకుతోడెవ్వరు ॥వి॥గ॥ 28

ఆ॥ చెప్పనలవిగాని చెడ్డకర్మముచేత
ముప్పదప్పదయ్యె మునులకైన
తాను జేయుకర్మ తగిలి బాధించును ।వి।గ। 29

ఆ॥ సర్వమున్నదనుచు సంసారమునమున్గి
పొంగుచుండునరుడు పొలుపుగాను
తనకునెంతయున్న తనవెంటవచ్చునా ।వి।గ। 30

ఆ॥ ఇహముసుఖముజూచి యిహమువిడువలేక
విర్రవీగుచుండు వెర్రిబట్టి
మర్మమెరుగలేక కర్మములోనాచు ।వి।గ। 31

ఆ॥ కర్మచేతనెపుడు కలుగునుజన్మంబు
జన్మమెత్తమరల సలుపుకర్మ
కర్మజన్మలేని మర్మంబుదెలియుమా ।వి।గ। 32

ఆ॥ మదినివిడువకున్న మానాభిమానముల్
మనుజనకునుజగతి మాయగెల్వ
తరముగాదుసుమ్ము తానెంతవాడైన ।వి।గ। 33

ఆ॥ మేమెహెచ్చటంచు మేదినిజనులెల్ల
చెప్పుకొనుటచాల చెడ్డతనము
అత్మనెరుగకున్న నతడెట్లు ఘనుడౌను ।వి।గ। 34

ఆ॥ కాంతమేనుజూచి భ్రాంతినొందగనేల
చీము నెత్తురనెడు చింతలేక
క్రొవ్వుకండలందు కోర్కెనిల్పగబోకు ।వి।గ। 35

ఆ॥ ఎంతవానికేని కాంతలతోపొందు
పాపమనిరిగాదె పరమమునులు
కాంతవిడచువాడు ఘనమైనయోగియా ।వి।గ। 36

ఆ॥ సత్యమెల్లజగతి జనవిరోధంబాయె
సనృతమెనరులకు నరయతీపు
ఏదినిత్యసుఖము మెఱుగక యుండిరి ॥వి॥గ॥ 37

ఆ. సత్వగుణముచేత సాధనసంపత్తి
నభ్యసించిదాని యర్థమెరిగి
ఆత్మ నెరుగుమార్గ మవనిలోగాంచును ॥వి॥ 38

ఆ. ఆయువెన్ని కొద్దియైయుండు నరునకు
ఆశవిడువకుండు లేశమైన
ఇట్టిజీవి తుదకు పట్టిచేతులబోవు ॥వి॥గ॥ 39

* ఎరుక. బోధ *

ఆ. శ్రీమదాత్మగురుడు శివునియంశంబున
జనులనుద్ధరింప జగతిబుట్టి
మేలుచేయుచుండె కీలుబాగుగదెల్పి ॥వి॥గ॥ 40

ఆ. మురికియద్దమందు మోముగాననియట్లు
జీవబుద్ధిచేత శివునిగనక
పుట్టిచచ్చుచుండు పుడమిలోనజ్ఞాని ॥వి॥గ॥ 41

ఆ. తారకమననాత్మ ధ్యానించుటను దెల్పు
సాంఖ్యసూత్రమెల్ల సాక్షి దెల్పు
నాత్మయేనేనని యమనస్కమొగిదెల్పు ॥వి॥గ॥ 42

ఆ. బంధుపుత్రమిత్ర భార్యాదులందరు
నాశమొందెనేని లేశమైన
శోకమొందకుండు సూటిగాంచినయోగి ॥వి॥గ॥ 43

ఆ. పవనమందిరమున పరమాత్ముడుండెను
గుట్టుదెలసినట్టి గురువువద్ద
చేరితెలసుకొనుడి చెడిపోవకనువృథా ॥వి॥గ॥ 44

ఆ. నిర్వికల్పమనెడు నిష్ఠనుండెడువాని
పలుకరింత్రుచలము పట్టిప్రజలు
చెడినకోతివనము జెరిచినట్లుగతాను ।వి।గ। 45

ఆ. సత్వగుణముగలుగ శాంతంబునిల్చును
శాంతమున్నసాధు జనులయొద్ద
జేరిగుట్టుతెలియ జేరునుబ్రహ్మాంబు ।వి।గ। 46

ఆ. తుచ్ఛగుణమువిడచి తుదితురీయంబున
సాక్షినెరుగునతడు సాధువగును
సాక్షినెరుగతరమె సామాన్యజనులకు ।వి।గ। 47

ఆ. సర్వవాసనలను సంకల్పములనెన్నొ
అంతలోనెచేయు వింతగాను
చిత్రమైనమనసు చెప్పతరముగాదు ।వి।గ। 48

ఆ. దేహమోహముడిపి దేవునిజూపిన
గురునినెపుడుధరణి మరువరాదు
మరచినట్టివారు మానవపశువులు ।వి।గ। 49

ఆ. దుష్టహయమువంటి దుర్మార్గమనసును
శిక్ష సేయవలె నుపేక్షమాని
శిక్షజేసియాత్మ చెంతజేర్చగవలె ।వి।గ। 50

ఆ. మూడుదేహములకు మూలమైనట్టియా
సాక్షినెరుగువాడు సాధువగును
సాధువులనుగొల్వ సౌఖ్యంబుసమకూరు ।వి।గ। 51

ఆ. అలవికాదు తెలియ ననుభవాత్ములగుట్టు
సత్వగుణముగలుగు సరసుడెరుగు
కల్లలాడుజనులు కానంగలేరెందు ।వి।గ। 52

ఆ॥ సత్యమెల్లజగతి జనవిరోధంబాయె
నన్నృతమేనరులకు నరయతీవు
ఏదినిత్యసుఖము మెరుగకయుండిరి ॥వి॥గ॥ 37

ఆ. సత్వగుణముచేత సాధనసంపత్తి
నభ్యసించిదాని యర్థమెరిగి
ఆత్మనెరుగుమార్గ మవనిలోగాంచును ॥వి॥ 38

ఆ. ఆయువెన్న కొద్దియైయుండు నరునకు
ఆశవిడువకుండు లేశమైన
ఇట్టిజీవి తుదకు వట్టిచేతులబోవు ॥వి॥గ॥ 39

* ఎరుక. బోధ *

ఆ. శ్రీమదాత్మగురుడు శివునియంశంబున
జనులనుద్ధరింప జగతిబుట్టి
మేలుచేయుచుండె కీలుబాగుగదెల్పి ॥వి॥గ॥ 40

ఆ. మురికియద్దమందు మోముగాననియట్లు
జీవబుద్ధిచేత శివునిగనక
పుట్టిచచ్చుచుండు పుడమిలోనజ్ఞాని ॥వి॥గ॥ 41

ఆ. తారకమననాత్మ ధ్యానించుటనుదెల్పు
సాంఖ్యసూత్రమెల్ల సాక్షిదెల్పు
నాత్మయేనేనని యమనస్కమొగిదెల్పు ॥వి॥గ॥ 42

ఆ. బంధుపుత్రమిత్ర భార్యాదులందరు
నాశమొందెనేని లేశమైన
శోకమొందకుండు సూటిగాంచినయోగి ॥వి॥గ॥ 43

ఆ. పవనమందిరమున పరమాత్ముడుండెను
గుట్టుదెలసినట్టి గురువువద్ద
చేరితెలసుకొనుడి చెడిపోవకనువృథా ॥వి॥గ॥ 44

ఆ. నిర్వికల్పమనెడు నిష్ఠనుండెడువాని
పలుకరింత్రుచలము పట్టిప్రజలు
చెడినకోతివనము జెరిచినట్లుగతాను ।వి।గ। 45

ఆ. సత్వగుణముగలుగ శాంతంబునిల్చును
శాంతమున్నసాధు జనులయొద్ద
జేరిగుట్టుతెలియ జేరునుబ్రహ్మంబు ।వి।గ। 46

ఆ. తుచ్ఛగుణమువిడచి తుదితురీయంబున
సాక్షినెరుగునతడు సాధువగును
సాక్షినెరుగతరమె సామాన్యజనులకు ।వి।గ। 47

ఆ. సర్వవాసనలను సంకల్పములనెన్నో
అంతలోనెచేయు వింతగాను
చిత్రమైనమనసు చెప్పతరముగాదు ।వి।గ। 48

ఆ. దేహమోహముడిపి దేవునిజూపిన
గురునినెపుడుధరణి మరువరాదు
మరచినట్టివారు మానవపశువులు ।వి।గ। 49

ఆ. దుష్టహయమువంటి దుర్మార్గమనసును
శిక్షసేయవలె నుపేక్షమాని
శిక్షజేసియాత్మ చెంతజేర్చగవలె ।వి।గ। 50

ఆ. మూడుదేహములకు మూలమైనట్టియా
సాక్షినెరుగువాడు సాధువగును
సాధువులనుగొల్వ సౌఖ్యంబుసమకూరు ।వి।గ। 51

ఆ. అలవికాదుతెలియ ననుభవాత్ములగుట్టు
సత్వగుణముగలుగు సరసుడెరుగు
కల్లలాడుజనులు కానంగలేరెంచు ।వి।గ। 52

ఆ. ఎన్నిజన్మలెత్తి ఏపాట్లుబడినను
బ్రహ్మవలనగలుగు భవ్యసుఖము
చేరిగురునిసేవ చేయకగలుగునా ॥వి॥గ॥ 53

ఆ. సాంఖ్యతారకముల సాధింపకుండిన
నాత్మనెరుగుబాట లవనిగలవె
గానగురునిజేరి గనవలె పరమును ॥వి॥గ॥ 54

ఆ. తనువులోననున్న తత్వంబుదెలియక
మోనపోవుటెల్ల మొద్దుతనము
అదియుదెలసిబ్రతుకు నతడెపోసుజ్ఞాని ॥వి॥గ॥ 55

ఆ. శత్రులార్వురుండ్రు శ్రమబూనివారిని
బట్టిచంపిగురుని పజ్జజేరి
ఆత్మతత్వమెరుగ నానందమందును ॥వి॥గ॥ 56

ఆ. తారకమనుదాని తనువులోగనకున్న
మనసునిలుపులోప మరియుగలదె
మనసునిలుపువాడు మహనీయుడై యుండు ॥వి॥గ॥ 57

ఆ. మాయచేయుచున్న మహిమ తెలియరాదు
అంతలోనెమరపు నట్టచేయు
మాయమర్మమెరుగ మహిలోనధన్యుండు ॥వి॥గ॥ 58

ఆ. మూలమెరుగలేక ముక్తినిజెందక
విర్రవీగుచుందు వెర్రిబట్టి
మాయచేతజిక్కి మమతవీడగలేదు ॥వి॥గ॥ 59

ఆ. ఇడకుపింగళకును నడుమనిమిడియున్న
వెలుగున న్రమింప వేడ్కజెందు
వారికేల జపతప వాంఛ లేటికిగల్గు ॥వి॥గ॥ 60

ఆ. సంగవర్జితుండు సంశయంబులు లేక
సరిగజూచుచుండు సాక్షి నెపుడు
సాక్షిజూడకున్న సాధు వెట్లగు తాను ॥వి॥గ॥ 61

ఆ. నమ్మిగురునిగొలచి నాల్గుమహావాక్య
ముల నెరుంగజాలు పుణ్యపురుషు
డతులితప్రమోదమందును సతతంబు ॥వి॥గ॥ 62

ఆ. పగలు రాత్రులందు పనులలో మునిగియు
తన్ను గానలేక తల్లడిల్లు
నట్టివారి కెట్టులలవడు బ్రహ్మంబు ॥వి॥గ॥ 63

ఆ. వంచనంబొనర్చి పంచతన్మాత్రల
పరమపదవికొరకు పాటుబడుచు
నిష్ఠవిడువబోకు నీవేదియొల్లైన ॥వి॥గ॥ 64

ఆ. కుటిలగుణము లేక కుదురుగా మనసును
చెదరనీక నాత్మ చెంత జేర్చి
నిత్యసుఖమునొందు నిర్మలుండై తాను ॥వి॥గ॥ 65

ఆ. ఎన్నిజన్మలెత్తి యేపాట్లుబడితివో
యిప్పుడైనగురుని యింట జేరి
జన్మరహితమైన మర్మంబు దెలియుమా ॥వి॥గ॥ 66

ఆ. కోతికొలువు జేయ కోర్కెతో ముగ్గురు
బంటులగుచు దాని వెంటదిరుగ
పులినిజూచి చచ్చిపోయిరినల్వురు ॥వి॥గ॥ 67

ఆ. ఆశవిడచివేసి యశముగాంచుచున్న
వానికేలనరయ వనితపొందు
మలమ్ము విడుచువాడు మరిదానిగోరునే ॥వి॥గ॥ 68

ఆ. పంచభూతములకు పట్టుగా రాకను
నన్నిటనువసించు నాత్మనెరిగి
సంతసంబుజెందు సాధుసత్తముడెందు ।వి।గ। 69

ఆ. మాటలెల్లవిడచి మాయకవ్వలనున్న
మూలమెరుగువాడు ముక్తిజెందు
వానిబాగడవశమె వారిజాసనుకైన ।వి।గ। 70

ఆ. నేలపాన్పుజేసి పేలికలెల్లను
గట్టుచుండుమౌని ఘనముగాను
భోగవాంఛలేక బుడమినివర్తించు ।వి।గ। 71

ఆ. అంత్యకాలమందు నాలుపిల్లలుగూడి
గొల్లుమనుచునేడ్చి గొడవజేయ
చెవినిడకయెజ్ఞాని చెందగవలెముక్తి ।వి।గ। 72

ఆ. జ్ఞానహీనుడైన వానికెన్నటికిని
నజునివశముగాది కాత్మజూప
జ్ఞానవంతుడైన ఘనయోగిజూచును ।వి।గ। 73

* పరిపూర్ణబోధ *

ఆ. ద్వాదశియనుమంత్రి మాదరించిజపింప
బట్టబయలుగాగ బాటదెలుపు
బాటదెలిసినేని పరిపూర్ణమైయుండు ।వి।గ। 74

ఆ. కలనుగాంచుచున్న కాయములవిధాన
మాయ యెరుకవచ్చె మహినటంచు
పంచదశియుదెల్పు బాగుమీరంగను ।వి।గ। 75

ఆ. ఎరుకతీసివేసె నెపుడులేకుండగ
షోడశాక్షరెపుడు చోద్యముగను
ఎరుకవిడచువాని నెన్నటకష్టంబు ।వి।గ। 76

ఆ. సూక్ష్మబుద్ధిచేత సూటినెరింగియు
దుఃఖమేమిలేక దొడ్డసుఖము
నొందియోలలాడు చుండువాడచలుండు ॥వి॥గ॥ 77

ఆ. సర్వకార్యములను జరపునుమనవలె
నచలుడనుచు వీని ననుటయెట్లు
అబ్బనచ్చదందు రజ్ఞులుకొందరు ॥వి॥గ॥ 78

ఆ. సకలకృత్యములను జరపుచున్నను
కేవలాత్మగనుచు భావమెరుక
మరపులేకయున్న మరలజన్మించడు ॥వి॥గ॥ 79

ఆ పనులుజేయుచున్న పరిపూర్ణమెప్పుడు
గానవచ్చుకనుల గట్టినట్లు
అందరెరుగజాల రట్టివారలగుట్టు ॥వి॥గ॥ 80

ఆ. సంశయములులేక సాక్షికవ్వలనున్న
పూర్ణభావమెరుగు బోధగురువు
మాయమహిమవిడఛి మహానీయుడై యుండు॥వి॥గ॥81

ఆ. ఎరుకవిడనివార లెనుబదినాలుగు
లక్షసంఖ్యయోను లనుజనింతురి
పూర్ణభావమెరుగ పుట్టబోరెపుడిక ॥వి॥గ॥ 82

ఆ. యతులుమునులుఋషులు నాత్మయేగతియని
పలికిరచలబోధ పట్టువడక
ఎరుకవిడకజనన మరణముల్ విడచునే ॥వి॥గ॥ 83

ఆ. ఎరుకవిడువకున్న నెంతివారలుగాని
పుట్టికిట్టకుండ పోరుపుడమి
ఎరుకదరికిరాదు గురుకటాక్షంబున్న ॥వి॥ 84

ఆ. నిర్వికల్పనిష్ఠ నిరతంబుమానక
సర్వసుఖములందు సాధుజనుడు
ఆశవిడచియెందు నాశములేకుండు ।వి।గ। 85

ఆ. లేనివాడువచ్చి పూనికచేత తా
నున్నవానిజూచి యుర్విలోన
కలసిమెలసిపోయె కానరాకుండగ ।వి।గ। 86

ఆ. పుట్టికిట్టనట్టి గుట్టుపట్టెరిగియు
సాధనంబొనర్చి సజ్జనుండు
చంపగలుగుమాయ సంసారవాంఛను ।వి।గ। 87

ఆ. వేదశాస్త్రములను వేసారిచదివిన
బ్రహ్మమెరుగనగునె బ్రమలుగాక
భ్రమలువీడకున్న బ్రహ్మమెట్లగుతాను ।వి।గ। 88

ఆ. ఆత్మనాత్మనెరిగి నాత్మకుమించిన
దేవదేవునెరుగు దేశికుండు
దేవునెరుగకున్న దేశికుండెట్లగు ।వి।గ। 89

ఆ. తెలివిచేత తెలియు తేటగాబ్రహ్మంబు
తెలివిచేత తెలిసి తెలివివిడచి
నిష్ప్రపంచమందు నిలచినపూర్ణుడౌ ।వి।గ। 90

ఆ. చూచిచూడనట్టి చూపుచేనుండియు
చూపునెరుగునట్టి చూపువిడచి
పరమునెరుగువాడు పరిపూర్ణపదమందు ।వి।గ। 91

ఆ. ఎరుకమరపులేక యేకస్వరూపుడై
యున్నయోగిగాంచు నెన్నరాని
పరమపదవియనెడు పరిపూర్ణమెప్పుడు ।వి।గ। 92

ఆ. కార్యకారణములు కాకనున్నదియేదో
గురుముఖమునదాని గురుతుదెలసి
గురుతువిడచువాడు కూడునుపూర్ణంబు ।।వి।గ।। 93

ఆ. రెండురూపులొక్క రీతిగానుండును
పేర్మిసాధుజనుడు భేదమెరుగు
రూపులనగవాని రూఢి తెలియశేరు ।।వి।గ।। 94

ఆ. ఏమిచిత్రమారయెందుజూచినసందు
రూపమేమిలేక రూఢిగాను
గోచరించుచుండు గొబ్బునచలంబు ।।వి।గ।। 95

ఆ. అచలగురునిజేరి యచలంబుగనకున్న
జన్మరహితమగుట జరుగదెందు
తరచిచూడవలయు తగినయత్నంబుచే ।।వి।గ।। 96

ఆ. ఎరుకమరపులేయెందు జూచినగాని
నిండియున్నదాని నిజమెరింగి
ఐక్యమెవ్వడొందు నతడెపోబ్రహ్మంబు ।।వి।గ।। 97

ఆ. తపముచేసిచేసి తల్లక్రిందులుపడ్డ
కేవలాత్మ నెరుగగావశంబె
గురునికరుణబడసి గురుతువీడగవలె ।।వి।గ।। 98

ఆ. పట్టనలవిగాని పరిపూర్ణపదమును
తెలియవశముగాదు తేటగాను
గురునికరుణచేత గురుతువీడినగాని ।।వి।గ।। 99

ఆ. రూపుగానరూపు చూపింపతరమౌనె
పాపగుణములన్ని పారదోలి
మర్మమెరుగునట్టి మహనీయులకుగాక ।।వి।గ।। 100

ఆ. ఎరుపునలుపు తెలుపు లెన్నాళ్లుజూచిన
బ్రహ్మమెట్లులగును భ్రమలుగాని
ఎరుకవిడువకున్న నెరుగునాబ్రహ్మంబు ।వి।వే। 101

ఆ. కదలమెదలబోదు కనినకానగరాదు
పట్టుకొనుదమన్న పట్టుబడదు
అన్నినిండియుండు నదియేమిచోద్యమో ।వి।వే। 102

ఆ. మూడుకలియునట్టి ముమ్మూర్తులకోనలో
ప్రత్యగాత్మజూచి ప్రజలుదాని
కేవలాత్మయనుచు భావింతురదికల్ల ।వి।వే। 103

ఆ. ఎరుకచేతనెరిగి యెరుకనువిడచిన
నాతడిందుగాంచు నచలమాత్మ
నిందునెరుగకున్న నెందునెరుగలేడు ।వి।వే। 104

ఆ. చీకటియును వెలుగు గాక నన్నిటనిండి
పరగుబట్టబయలు నెరిగినేని
భయముదీరితాను పరిపూర్ణుడైయుండు ।వి।వే। 105

ఆ మొదలుతుదయులేక కుదురుగానున్నట్టి
పరముదెలియువాడు ధరనుయోగి
యోగియైనవాడు భోగమాసింపడు ।వి।వే। 106

ఆ. ఎందుజూడనందు సందేమియునులేక
యావరించియుండు నహమువిడచి
మాయకవలయున్న మానిసంఘమునకు ।వి।వే। 107

ఆ. చూడకుండజూడ చోద్యంబుగానిల
తెలిసితెలియకుండు తేటగాను
నంటియంటనట్టి యచలంబుధరలోన ।వి।వే॥ 108

ఆ. మూడుభేదములను మూడుకాలములందు
వదలివేయునతడు వసుధలోన
నిర్వికల్పమనెడు నిష్ఠలోనుండును ॥వి॥ 109

ఆ. పట్టనలవిగాని పరిపూర్ణమనుదాని
గురువుకరుణచేత గుట్టుదెలసి
పట్టజాలువాడు పండితుండనదగు ॥వి॥ 110

ఆ. బట్టబయలటన్న పరిపూర్ణపదమును
నెరిగితినని చెప్ప నేమిఫలము
పాధనంబులేక సమకూరదెవరికి ॥వి॥ 111

ఆ. ముందుతనకుజరుగ బోవనున్నదియేదో
తెలియదెవరికైన తేటగాను
ప్రాణముండగానె పరిపూర్ణమెరుగుమా ॥వి॥ 112

ఆ. ఎరుకనువిడదీసి మరుగెల్లజెప్పుట
హరిహరాదులకును తరముగాదు
హరిహరాదులకును నధికుండుగురుమూర్తి ॥వి॥ 113

అ. అచలమనుచు నెప్పు డనుచునుందురుగాని
అచలమెరుగవశమె యజునికైన
సూటిదెలియునతడు కోటికొక్కడుసుమీ ॥వి॥ 114

ఆ. చూపదేమిలేని చోటుజేరినవాడు
జననమరణమేమి జగతిలేక
యెరుకవిడచి యెపుడు యేమియెరుగనుండు ॥వి॥ 115

ఆ. మట్టపర్తివంశ మహాలక్ష్మమ్మ సత్తెమ
వరసుతుండ నడవపల్లియందు
చిన్నయార్యకరుణ శతకంబుజెప్పితి ॥వి॥ 116

* హితబోధ *

సీసపంచకం.

సీ॥ సర్వభోగంబులు సత్యమనుచునమ్మి
నిజమెఱుంగక యుంట నీచమగును
భార్యయేతనకును పరదైవమనినమ్మి
తల్లిదండ్రులవీడ దగదుసుమ్మి
ధనమున్నదనియుబ్బి తనుభుజించుటగాదు
బీదలగనిపెట్టి పెట్టవలయు
మద్యమాంసంబుల మక్కువతోమెక్కి
మహినిపొర్లాడుట మంచిగాదు
తే॥ ఎన్నియున్నను మనకిచటేమిసుఖము
విమలవైరాగ్యమునుజెంది క్రమముతోడ
గురువుచరణంబులనుబట్టి గురుతుదెలసి
హితముగనుడయ్య పరముసాధించుడయ్య।

సీ॥ అందచందంబుల నద్దంబులోజూచి
మురియుచునుండెడు మూర్ఖుడొకడు
పరదారలనుగాంచి పండ్లికిలించుచు
భ్రాంతినొందుచునుండు భడవయొకడు
పరధనంబులుకంట బడినపేరాశతో
దొంగిలింపగనెంచు తులువయొకడు
సాధుజనులనుగాంచి సరసంబులాడుచు
హేళనగావించు కూళయొకడు
తే॥ కొంతకాలంబు బ్రతుకుకే యింతచేటు
నిక్కనీల్గుచునుందురు నీచులకట

గురువుచరణంబులనుబట్టి గురుతుదెలసి
హితముగనుడయ్యా పరముసాధింపుడయ్యా ।

సీ॥ చందనాగరువున్ను జవ్వాదిబూసిన
మలమూత్రములకంపు మార్పనగునె
సబ్బుగట్టిగరాసి స్నానంబుజేసిన
కడుపులోమలినమే కడకుపోవు
పట్టువర్ధనములు గట్టిగాబెట్టిన
శ్రీహరి సాక్షాత్కరించబోదు
మెడను రుద్రాక్షల మెండుగాగట్టిన
ప్రారబ్ధకర్మంబు పారిపోనె

తే॥ ఇట్టివేషంబులను మాని గట్టిగాను
ఇహమునకుజిక్కిపోక మీరింపుమీర
గురువుచరణంబులనుబట్టి గురుతుదెలసి
హితముగనుడయ్యా పరముసాధింపుడయ్యా ।

సీ॥ తారకసాంఖ్యముల్ తరచెడిపనియేల
గురుమాటదెలసిన సరసులకును
మనమునింద్రియముల మరలింపగానేల
గురుమాటదెలసిన సరసులకును
జపతపక్రతువుల జరియింపగానేల
గురుమాటదెలసిన సరసులకును
సగుణనిర్గుణములు సాధింపగానేల
గురుమాటదెలసిన సరసులకును

తే॥ గానమెటులోప్రయత్నించి ఘనముగాను
కష్టములలెక్కచేయకే కలియుగమున
గురువుచరణంబులనుబట్టి గురుతుదెలసి
హితముగనుడయ్యా పరముసాధింపుడయ్యా ।

సీ॥ వేదశాస్త్రాదుల వినలేదు కనలేదు
చదువగా వ్రాయగా జాలమిగుల
శబ్దార్థములను లక్షముల నెరుగను
పండితుండను గాను పామరుండ
అనుభవంబునకు నాకందిన దెల్లను
వ్రాసితి గొప్పకై వ్రాయలేదు
తప్పులున్నను వాని నొప్పులుగా దిద్ది
మన్నించుడి దెనాదు విన్నపంబు

తే॥ గురుకటాక్షంబుచే జెందె బరిసమాప్తి
వినుడు వినదగియున్నను గనుడు ముదము
గురువుచరణంబులను బట్టి గురుతు దెలసి
హితముగనుడయ్యా పరము సాధింపుడయ్యా॥

---

* కీర్తన *

(1) శంకరాభరణం—ఏక తాళం.

హంస తారకము గూడినవారికి హింసలు తొలగును ఓమనసా॥ సంసారములో మునిగినవారు సాధింపగ లేరో మనసా హంస॥ రేచక పూరక మోమనసా॥ రేపగలు నడుపవలెనో మనసా॥ దేశిక కృపచేగాని వివరముగ దెలియబడదుగదె ఓమనసా॥ హం॥ ఫాలభాగముననో మనసా॥ పరంజ్యోతిగను మోమనసా॥ కీలు దెలుసుకొని సమరసమందున నోలలాడుచుండుము మనసా॥హంస॥ చిత్రభావమది యెల్లప్పుడునీ చిత్తములో గను మోమనసా॥ పుత్రమిత్రకళత్ర బంధువుల పొత్తునబడి చెడకో మనసా॥హంస॥ మరువకు మని మళయాళస్వాములు మరిమరి దెల్పిరి ఓమనసా॥ సరిగనడవపల్లియు నీమార్గపు సారముగను గొనెనో మనసా॥హంస॥

(2) బేహాగ్ రాగము-ఏకతాళం.

నీవేబ్రహ్మవు నీవేవిష్ణువు నీవేమాహేశ్వరుడవురా నీవునిన్గనుచుంటే దీని నిజమునీకే తెలియునురా॥నీవే॥ అయిదు గురుపనివాండ్రుగూడి ఆలయమునిర్మించిరిరా అయిదైదులు తామిరువైయైదై యందునివాసము సల్పిరిరా॥నీవేబ్ర॥ అట్టి దేవాలయములోపల గట్టిచక్రములారురా। దిట్టమయిన రెండుపాములు దిగుచునెక్కుచునుండెరా॥నీవే॥ పాములానుపట్టెటందుకు పరమగురుని వెదుకరా। కామక్రోధములను రోసి స్వామికృపను బడయరా॥నీవే॥ మర్కటంబు నీలోనుండి మాయచేయుచుండురా। తర్కమేలదానిజంపి తత్వమరసిజూడరా॥ నీవే॥ లోకమంతట నిండియున్నది ప్రకటంబుగ తెలియరా। తేకువతోదానిబొంది తెలిసితెలివివివిడువరా॥నీవే॥ గురుకృపచేగానిదీని గురుతు తెలియబడదురా। నిరుపమాననిష్కళంక నిజపదంబిదిగనుమురా॥నీవే॥ ధరణిలోపలచెన్నమల్లార్యులు దయతోదెల్పినమార్గమురా। నిరతిమును నడవపల్లి నిజముగనుగొని చెప్పెరా॥నీవే॥

(3) కమాచి రాగము-ఆట తాళం.

తెలసికొనుటకు తరముగాకను తెలివిమీరి యున్నది। అలవిగాకను జగములేకను అచలమిదియైయున్నది॥తెల॥ కార్యకారణరహితమైనది కన్నులకుగనరానిది। ధైర్యమింద్రియనిగ్రహులకది దారియేయగుచున్నది॥తెల॥ సత్తుచిత్తు గానిదీ అది సర్వమయమైయున్నదీ। మత్తులకునదిగోచరింపక మాయకవ్వలనున్నదీ॥తెల॥ నిరామయమైయున్నదియది నిష్కళంకంబైనదీ। జరామరణములకుజిక్కని చక్కనిగురుసూటదీ॥తెల॥ ధరనుముంత్రా చన్నమల్లురువరులు దెల్పినగురుతదీ। మరగినడవపల్లి నిరతము సరగునబొందున్నదీ॥తెలసి॥

(4) శహాన రాగము—ఆది తాళం.

ఆహాపరిపూర్ణంబెంతో ఆగాధంబై యున్నదిరా। దేహాభిమానమువిడచి దేశికకృపచేగనుగొనువారికి ।ఆ। ఇష్టముతో గురుడిచ్చినగాని కష్టమురాయదిపట్టుకొనుటకును। అష్టమదములను ద్రుంచినవారికి నిష్టనిలచినిజమార్గముతెలియగ।ఆహా। జాగ్రత్స్వప్నసుషుప్తులుమీరి జాగరూకతతోనుండి విరతమును బాగుమీరబ్రిమలువీడి బ్రహ్మానందములో లయమందినవారికి ఆహా। ఆత్మానాత్మవివేకముగలిగి అనుభవమునతా నానందుండై। నిత్యమునిర్మలమందున నిలచినిలకడగానిజమెరిగినవారికి ।ఆహా। ముదముతో చెన్నమల్లార్యులుకరుణను పూర్తిగదెల్పిన భావమిదీ। సదానడవపల్లియు బోధనుగని సాధనజేయుచునుండెనిదీ ।ఆహాపరి।

(5) బారువరాగము—జంపె తాళం.

జననమరణములేని సాంప్రదాయంబును జాగరూకతగాంచుడీ। అనయమునుసద్గురునడిగి యనుభవమైనయచలభావమునొందుడీ।'జన।। అష్టమదములనణచి కష్టమని యనుకొనకనిష్టలో నిలచుండుడీ। సృష్టిలోపల నెపుడు చూడశక్యముగాని చోద్యమున్నదిగాంచుడీ।।జన।। సగుణంబుతాగాక నిర్గుణంబునుమీరి సర్వమయమదిగాంచుడీ। నిగమాంతవేద్యమై నిరుపమానందమై నిర్విషయమును జెందుడీ। జన।। తెలివిచే తెలసికొని తెలివివిడచినగాని తెలియబడదిది గాంచుడీ। అలవిగాదనుకొనక అనుభవంబునమీరు ఆనందమునుబొందుడీ।।జనన।। చెప్పనేటికి ముంతా చెన్నమల్లార్యగురు సేవజేసియుగాంచుడీ। చెప్పనడవపల్లి యొప్పుగాజూచియిది తప్పనుకొనకెంచుడీ ।।జనన।।

ఓంశాంతిః శాంతిః శాంతిః.

సమాప్తం.